సంపుటము 4] ఏప్రిల్, 1918 [సంచిక 10

# బాలమిత్ర



## ఈస్టర్ సంభాషణ

తాతయ్య:— ప్రకాశరావూ! ఈస్టరు పండుగన నేమో దాని అర్థము దెలుపుదురా?

ప్రకాశరావు:—సందేహము లేకుండా దెలుపుదు నాలకించెదరా?

తాతయ్య:—అయ్యా! ఆ పండుగెందు కాచరించవలసి వచ్చెనో నాకు వివరముగా బోధించుడు.

ప్రకాశరావు:—వినుము, ఈ లోకములోనుండు ప్రజలందరు పాపముతో నిండియుండగా ఆ పాపమునుండి విమోచించుటకు దేవుడు తన కుమారుడైన యేసుక్రీస్తు ప్రభువును పంపెను.

తాతయ్య:—ఆయన ఈ లోకమునకు వచ్చి ఏమిచేసెను?

ప్రకాశరావు:—ఆయనా? మన పాపములనుండి దొలగు మార్గము, రక్షణమార్గము జూపి, మనయందరి పాపముల నిమిత్తము సిలువమ్రానుమీద తన రక్తము చిందించి చనిపోయెను.

తాతయ్య:—ప్రకాశరావూ? పాపపరిహారముకొరకు మేము పశువులను అర్పించుదుము, దానివలన లాభములేదా?

ప్రకాశరావు:—బొత్తిగా లాభములేదు. ప్రజలు పాపము చేయగా పశువుల నర్పించుటవలన పాపపరిహార మెట్లు కలుగును? పాపరహితుడైన యేసుక్రీస్తు రక్తమువలన తప్ప మరి దేనివలన కలుగదు.

తాతయ్య:—అయ్యా! ఆయన యిప్పుడున్నాడా?

ప్రకాశరావు:—సందేహము లేకుండా ఉన్నాడు.

తాతయ్య:—రుజువు చేయండి నమ్మెదను?

ప్రకాశరావు:—కోడిగ్రుడ్డును యెప్పుడైనా చూచియున్నావా? దానిలో యేముండును?

తాతయ్య:—చూచియున్నాను, దానిలో ఎర్రని జెనయుండును, చాలమంది తినెదరు.

ప్రకాశరావు:—అంతమాత్రమే గ్రహించితివా? ఆ జెనలో జీవమున్నది. ఎట్లన? కోడి పొదిగిన తరువాత ఆ గ్రుడ్డులోనుండి ఒక జీవముగల పిల్ల పెంకులోనుండి బయటికివచ్చును.

తాతయ్య:—అవునండీ, ఆ సంగతి నేను గ్రహించకపోతిని.

ప్రకాశరావు:—ఆ ప్రకారము ప్రభువైన యేసుక్రీస్తు ఈ లోకప్రజల పాపముల నిమిత్తము చనిపోయి పాతిపెట్టబడి మూడవదినమున సమాధినుండి బయటికి వచ్చియున్నాడు. దానికి జ్ఞాపకార్థ మీ పండుగ ఆచరించెదము. ఇదియే దాని అర్థము.

తాతయ్య:—తిరిగి లేచినట్లు సాక్షులుండిరా?

ప్రకాశరావు:—సందేహములేదు. ఆయన తిరిగిలేచి తన శిష్యులకును, స్త్రీలలో, మగ్దలేనేమరియ, యోహన్న, సూసన్నలకును కనబడి 40 దినములు వారితో నుండెను.

తాతయ్య:—స్నేహితుడా! మనముకూడ తిరిగి లేచెదమా?

ప్రకాశరావు:—మనముకూడ లేచెదము. మరణము ఒక నిద్ర వంటిది. అందరము క్రీస్తుప్రభువువలె లేచి ఆయనను చూచెదము.

తాతయ్య:—అయ్యా! మోక్షమెట్లు దొరకును?

ప్రకాశరావు:—ఈ ప్రభువునందు విశ్వాసముంచి ఆయన ఆజ్ఞలను నెరవేర్చుటవలనను, ఆయనపేరట బాప్తిస్మము పొందుటవలనను దొరకును.

తాతయ్య:—ఇంత వివరముగా దెలిపి నాకు రక్షణమార్గము జూపినందుకు మీకు నమస్కారము.

ప్రకాశరావు:—దేవుడు మిమ్మాశీర్వదించుగాక.

---

# ఈగలు

ఈగలను మీ యింటిలోనికి రానియ్యవద్దు.

వానిని మీ భోజనముపైన వ్రాలనియ్యవద్దు.

ముఖ్యముగా పాలమీద వ్రాలనీయకుడి.

ఈగలు విశేషముగాగల స్థలమునుండి మీ యాహార పదార్థములను కొనకుడి.

ఈగలు రాగల స్థలములందు భుజింపకుడి.



ఈగలు మనుష్యులకు మిగుల హాని కలుగఁజేయు ప్రాణులై యున్నవి. ఇవి మిక్కిలి మురికిప్రాణులు. మలినమందవి పుట్టును. వీనివలన దేశమందు జాడ్యములను వ్యాపింపఁజేయు పురుగులు ప్రబలును. ఏ ఏ స్థలములందవి వ్రాలుచుండునో ఆయా స్థలములందెల్ల జాడ్యములను వ్యాపించు పురుగులను విడిచి మనుష్యులకు వ్యాధులను కలిగించుచుండును. అవి ఒక వేళ బహు చెడ్డ రోగిష్ఠులుగల స్థలమునుండి మీ వంటగదికి లేక భోజనముచేయు స్థలమునకు రావచ్చును. ఆ రీతిగానే ఆరోగ్య భాగ్యముతో నలరుచుండువారికి నానావిధ రోగ ములను పుట్టించి బాధింపగలవు.

మురికి పెంటలమీదను, రోగ పీడితులైన వారిమీదను పీను గులమీదను వ్రాలెడి ఈగల విషయము మీరు జాగ్రతగా నుండనియెడల మీకెంత హాని సంభవించునో యోచించుడి!

## నమ్మకమైన బాలప్రియ

నాయనమ్మకు చాల తలనొప్పి వచ్చినది. ఇంటిలో నాయనమ్మయు బాలప్రియయును, సుశీలమాత్ర ముండిరి.



గనుక ఆమె ఇల్లు సర్దిపెట్టలేక బాలుసితో దానిని సర్దుమనియు, సుశీలతో కట్టెలు లోన పెట్టుమనియు చెప్పి వెళ్లి పరుండెను. కొంచెము సేపటికి మంచి నిద్రపట్టినందున గురక పెట్టుచు నిద్రించుచుండెను.

సుశీల తనపని త్వరగా జేసికొని “నాపని అయినది. నాయనమ్మదగ్గరకు బోయెదను” అని బయలుదేరెను.

“సుశ్శీ, సుశ్శీ, నాయనమ్మకు తలనొప్పిగా నున్నది. వెళ్లి

తివా అది మరికొంచెము ఎక్కువగును. వెళ్లకుము" అని బాలుడనెను.

"నేబోయెదను, నాయనమ్మకొకమాట చెప్పవలెను."

"వరాండామీద ఆడుకో, నీ బొమ్మలు పట్టుకొనిరా. వాటికి భోజనము పెట్టి పెండ్లిసేయుదము."

"వద్దులే. నాకు బొమ్మలూవద్దు. గిమ్మలూవద్దని" సుశీల వెళ్లబోయెను.

"నా క్రొత్త పాఠపుస్తకములోని బొమ్మలు చూపించెదను. నాయనమ్మదగ్గరకు బోకపోతే ఆ పుస్తకములోని వన్నీ చూపించెద" నని బాలుడనెను.

పుస్తక మనగానే సుశీల ఆగెను. ఇంతలో బాలుడు ఇల్లు చక్కబెట్టుకొని తన క్రొత్తపుస్తకము దెచ్చినందున ఇద్దరు చాప పరచుకొని వరాండాలో కూర్చుండిరి. సుశీల బాలుని ఒడిలో కూర్చుండి కాగితములు తిరగవేయుచు, బొమ్మలను చూచి బహు సంతోషించుచుండెను.

ఇంతలో శతానందమును సుందరరావునువచ్చి, "బాలా! ఆడుకొందాము రా" అని బిలిచిరి.

"నేను రాను సుశీల నాడించుచున్నాను" అని బాలుడు చెప్పెను.

"సుశీల బొమ్మలతో నాడుకొంటదిలే" యని సుందరరావనెను."

“ఇప్పుడు రాకపోతే ఇకను ఆటలోకి రానియ్యము” ని శతానందము చెప్పెను.

“సుశీల ఒంటరిగా ఆడుకోనదు. మా నాయనమ్మకు తల నొప్పిగానున్నది. నేను వచ్చినయెడల సుశీల నాయనమ్మను లేపును. నేను బొమ్మలు జూపెడనంటిని. గనుక రాను” అని బాలప్రియను జవాబిచ్చెను.

బాల మళ్లీ తక్కిన బొమ్మలు చూపించుట కారంభించెను. గంటసేపయిన తరువాత నాయన ఇంటికివచ్చెను. వచ్చి “సాయంకాలము నాలుగు గంటలప్పుడు, మామయ్య గుర్రపుబండిలో ఇక్కడికి వచ్చెదననెను. అప్పుడు తన ఆటను పోగొట్టుకొని చెల్లెలు నాడించినవారు ఆ బండిమీద యెక్కి షికారుగా తిరిగి రావచ్చును. నేను, సుశీల ఆడుకొంటాము” ని చెప్పెను.

బాలునికి కలిగిన సంతోషమునకు మితములేకపోయెను. “నాయనా! ఇంకొకపర్యాయము మామయ్య వచ్చినప్పుడు సుశీలను పంపుదము. నేను వదలుకొనిన ఆట ఈ బండిమీద సవారిచేయుటలో సగము కులాసాగానైనను ఉండదు” అని బాలుడు చెప్పెను.

# కనుగొనవలసినవి

సముద్రము దాని గర్భమునుండి పొర్లిరాగా……
దానిని మూసివేసినవా డెవడు?

నేను మేఘమును దానికి……గాఢాంధకారమును దానికి పొత్తిగుడ్డగాను వేసినపుడు……నియమించి……పెట్టించినపుడు.

ఈ వచనమంతయు నేమిటి? యెచ్చట వ్రాయబడి యున్నది?

2. కీర్తన పుస్తకములో సముద్రము ఘోషించుటను గూర్చి యెచ్చట వ్రాయబడియున్నది? అది నీకు కంఠతగా తెలియునా?

3. బలమునే నడికట్టుగా కట్టుకొనినవాడై……ఘోషను……అణచువాడు.

ఈ వచనమును పూర్తిచేసి, యిది యెచ్చట వ్రాయబడి యున్నదో కనుగొనుము?

4. సముద్రముపొంగు నణచువాడవు నీవే. దాని తరంగములు లేచునప్పుడు నీవు వాటిని అణచివేయుచున్నావు.

ఈ వచనము యెచ్చట ఉన్నది?

5. యెషయా 40: 12 వచనమునుండి యేమి నేర్చుకొనుచున్నావు?

ప.రా.—పై ప్రశ్నలకు జవాబు వ్రాయువారు, సముద్రమునకు అవలనుండు ద్వీపములలో నివసించు జనులను గూర్చియు, వారు మన భోజనమునకును, యితర ప్రయోజనముగల కార్యములకును పంపు సామానులనుగూర్చియు వ్రాసినయెడల సంతోషింతుము. 14 సంవత్సరముల ప్రాయమునకులోగా నుండువారు యెవరైనను వ్రాయవచ్చును.

---

# ప్రార్థన బలము

ప్రష్యా దేశమందు రాజద్రోహమునకై ఒక సైన్యాధిపతి చెరయందు ఉంచబడెను. ఆ చెరసాల సామాన్యమైనదిగాక అధిక చీకటిగలదై నిర్జనప్రదేశమునందు ఉండెను. రాజునకు ఆ నేరస్తునిపై చాలకోపము ఉండుటచేత అతడు మరణపర్యంతము ఆ చెరయందే యుండునట్లు యేర్పాటు చేసెను. అతనికి యేపనియు లేనందునను, మనుష్యసహవాసము లేనందునను పిచ్చిపట్టిన ట్లుండెడిది. కొన్నియేండ్లు యిట్లు గడచినతరువాత ఒకరాత్రి తుఫానుబట్టి ఆ ప్రాంతములన్నియు ఉరుముశబ్దముతో ప్రతిధ్వనించుచుండెను. అప్పుడు ఆ సైన్యాధిపతికి తన జీవితకాలమంతయు జ్ఞప్తికిరాగా తన పూర్వచరిత్రను తలచుకొని అతడు విచారపడసాగెను.

అంతలో అతనికి తన బైబిలుసంగతి జ్ఞప్తికివచ్చి దానిని త్వరితముగ తెరచి చదివెను. అతడు దానిని విప్పగనే "ఆపత్కాలమున నాకు మొరపెట్టుము. నేను నిన్ను విడిపించెదను. నీవు నన్ను మహిమపరిచెదవు." అను వాక్యము వచ్చెను మరికొన్ని వాక్యములనుకూడ అతడు చదివెనుగాని ఆ మొదటివాక్యమే అతని మనస్సునాటి, అతడు మోకాళ్లూని ప్రార్థించెను. ఇదియే అతని జీవితకాలములో మొట్టమొదట ప్రార్థించిన సమయము. అతడు అట్లుండ పరమునందలి దూతలు యెంత ఆనందించిరో, పరమతండ్రియు పశ్చాత్తాపపడుచున్న యీ పాపిమొరకు చెవియొగ్గి యతని మొట్టమొదటి ప్రార్థనను వినెను. ఆ రాత్రియే రాజమందిరమున రాజుగారికి నిద్రపట్టక ఆయన తన పరుపుపై యిటు అటు కొట్టుకొని, "సర్వేశా! ఒక గంటసేపైనను నాకు నిద్రపట్టనిమ్ము" అని ప్రార్థించెను. వెంటనే అతనికండ్లు మూతలుపడి, మంచి విశ్రాంతి గలిగెను. ఉదయముననే అతడులేచి భార్యనుచూచి "దేవుడు రాత్రి నన్ను కరుణించినందున నేనుకూడ నా గొప్పశత్రువు తప్పుల మన్నించి దాని నీ దినమున సంతోషపరతును. అట్టివారు యీ రాజ్యమున యెవరున్నారు?" అనగా ఆమె సైన్యాధిపతిమాట అతనికి జ్ఞప్తిచేసెను. అతడే క్షమించబడ తగినవాడని రాజు

యొంచి బంటునుపంపి, యతని చెరనుండి విడిపించెను. అతడు మార్పుజెందినవాడై, దేవునికి వందనములు చెల్లించి, ప్రార్థన బలమును గ్రహించి, సంతసించి ప్రభువు భక్తుడయ్యెను.

---

# ప్రకృతి పాఠములు

## 43 వ పాఠము

## జంతువుల అవయవములు

(గతసంచిక శేషము)

ప్రతి జంతువుయొక్క ఆకారమును, అవయవములును, దాని దాని జీవనమునకు తగిన రీతిని జేయబడియున్నది. కొన్ని ఎగురునట్లు సృష్టింపబడినవి. వీనికి రెక్కలుండును. ఆకాశమునందు సంచరించెడి పక్షులను పురుగులను గమనించినయెడల ఆ రెక్కలును వివిధరూపములు గలవిగా కనుపడును. కొన్ని జంతువులు నీటియందు జీవించుటకు తగినట్లు చేయబడినవి. వీనిలో అనేకమైనవానికి వెడలుపాటి తోకయు రెక్కలు నున్నవి. వీటి సహాయముచే నవి ఈదును. గాని పీతలవంటివి ప్రాకుచుబోవును. హైడ్రో

వంటివి తేలియాడును. కాకిచిప్పలలో నుండునటువంటిది ఎక్కడకును బోక నిలిచియుండును.

కొన్ని జంతువులు నేలపై నడుచును. రెండుకాళ్లమీద నిటారుగా నడచువాడు మనుష్యుడొక్కడే. తక్కినమృగము లన్నియు చతుష్పాత్తులు, అనగా నాలుగు పాదములు గలిగి నవి. కోతి అన్నిటిలో చిత్రమైనది. దానికున్నవి కాళ్లుకాదు చేతులుకాదు గాని రెంటికిని పనికివచ్చినవై యున్నవి. వీని సహాయముచే నవి బాగుగా చెట్లెక్కగలవు. అనేక పాద ములతో నడుచునుబోవు చిన్నజంతువు లనేకములు గలవు. పాములు కాళ్లు లేకున్నను బహు వేగముతో భూమిపై బోగలవు. కప్పలవంటివి దుముకుచు బోవును. మిడుతల వంటివి చాలదూరము దూకును, మిణ్ణలియు ఒక్క ఎగురుకు చాలదూరము బోగలదు. అంతంతదూరము దూకుటకు వీనికి మంచిబలముగల కండరములుండి తీరవలెను.

కొన్ని జంతువులు చాలవరకు ఇతరమైన వానితో బోలి యుండును. వానిలో కొన్ని జంతువుల ఎముకలు, నాడులు, కండరములు, గుండె, మెదడు చాలమట్టుకు మనుష్యునికున్న వాటివలె నుండును. చతుష్పాత్తులలో ననేకములైనవానికి అట్లుండును. మార్కెట్టులో అమ్మబడు జంతువుల కళేబర మును చూచి నీ శరీరములోని అవయవము లెట్లుండునో

కొంతవరకు చూచుకొనవచ్చును. మేక తలలోని మెదడును బట్టి నీ మెదడెట్లుండునో చూచుకొనవచ్చును. నీ ఊపిరి తిత్తులు దాని ఊపిరితిత్తులవంటివే. నీ గుండె దాదాపు దాని గుండెవలెనే యున్నది.

ఒక జంతువు ఎంత ఎక్కువగా కదలునో, దానికంత ఎక్కువ కండరము లున్నట్లు మనము చూడవచ్చును. అన్నిటి కన్న మనుష్యునిలో నెక్కువ కండరము లున్నవి. దేవుడు ప్రతి జంతువునకును దాని దాని బ్రతుకునకు తగినట్లు కావల సిన అవయవముల ననుగ్రహించి యున్నాడు.

మనస్సు చేతితో చేయునంతపని మరే యితర అవయవ ముతో జేయదు.



# నీ కెట్లు నవ్వురాకుండెను?

ఒక చిన్నపిల్ల బడినుండి యింటికివచ్చి తల్లితో, ,, అమ్మా! యీ దినము ఒక చిన్నపిల్ల తనకుర్చీపైనుండి క్రింద పడగా అందరు నవ్విరి. గాని నే నొక్కదాననే నవ్వలేదు ” అని చెప్పెను. అందుకు ఆమెతల్లి, ,, నా బిడ్డా! నీ వెంత మంచిదానవు. నీ కెట్లు నవ్వురాకుండెను?” అని అడుగగా, నా బాలిక, ,, అమ్మా! పడినపిల్లను నేనే. కావున నేను

నవ్వలేదు" అనెను. అందులకు తల్లి ఆమెను తన యొక్కన జేర్చి ముద్దుపెట్టుకొనుచు, తనలో తాను నవ్వుకొనెను.

---

# బాలమిత్ర టపా

ప్రియమైన బాలమిత్రులారా!

నేను మీకు ఒక యుత్తరము వ్రాయవలెనని అత్యాశక్తి గలదాననై కనిపెట్టి ఇప్పుడు వ్రాయుచున్నాను. మా తల్లిగారికి నలుగురు పిల్లలము. వారిలో నేను పెద్దపిల్లను. నా పేరు ప్రేమాక్షమ్మ. తక్కిన ముగ్గురును నా తమ్ములు. వారిలో పెద్దఅబ్బాయి బడికి వెళ్లుచున్నాడు. మేము పుట్టక ముందు మా తలిదండ్రులు చాల శ్రమలుపొంది క్రీస్తు ప్రభువునందు నమ్మి నెమ్మది కలిగియున్నారు. మా చిన్నయ్యలు కూడ ప్రభువునందు ఆశ కలిగియున్నారు, గాని లోకమునకు భయపడి బహిరంగముగా ఆయన నొప్పుకొనుటకు భయపడుచున్నారు గనుక వారి విషయమై మీరు మీ కుటుంబ ప్రార్థనలలోను సంఘములోను ప్రార్థించండి. నేను మీ విషయమై ప్రార్థించుచున్నాను. ప్రియ స్నేహితులారా! మన ప్రభువగు యేసుక్రీస్తువలెనే మనము మన తలిదండ్రులను సన్మానింతుముగాక! మా అందరిలో మా పెద్ద తమ్ముడు




చాల నెమ్మదిగలవాడు. వానివిషయమై మా తల్లిగారికి తండ్రిగారికి ఎక్కువ సంతోషము కలుగుచున్నది. బాల స్నేహితుడగు ప్రభువునకుకూడ సంతోషమేగదా! ప్రియ మిత్రులారా! మా తండ్రిగారు కుటుంబప్రార్థన చేయునప్పుడు మీ కేమి కావలసినను మీ పరలోకపుతండ్రిని అడుగుడి ఆయన మీ కిచ్చునని నమ్ముచున్నాడు.

ఇట్లు: మీకు వ్రాయునది,

పట్టా ప్రేమాకుమ్మ,

ధవళేశ్వరము, గోదావరిజిల్లా

C. L. S. PRESS, MADRAS—1918